*భగవన్నామస్మరణ ఎప్పుడు చేయాలి*

నామ స్మరణ - దాని వలన కలిగే లాభం

'సర్వ వేళలందూ విరామము లేక నామస్మరణ చేయాలి!!'

చెట్టు నాటిన తోడనే పండ్లను ఆశించకూడదు...

పండ్లు ఎట్లుండునో అని దాని రుచి తెలుసుకొనుటకై చెట్టు యొక్క ఆకులూ, బెరడూ నమలకూడదు...

అట్లు చేసినయెడల పండు యొక్క మాధుర్యమును తెలియదు, అంతియేకాక మొక్క నశించి పోవును...

అదే రీతిగా నామమను మొక్కను అభివృద్ధి పరచుకొనుటయే మన వంతు...

దానిని సరిగ్గా చేస్తున్నానా, లేదా నామములో మహత్తు ఉందా, లేదా అని ఈ రుచులు చూచుటకు ప్రయత్నించకూడదు, సందేహించరాదు, తప్పక ఆనామమను మొక్క వృక్షమై , మనము ఆశించిన ఫలమును మనకు తిని పించగలదు...

అట్టి ఫలమును పట్టుకొనునట్టి వల నామము, కనుక, ఆ నామమును ఎప్పుడు మార్చకుండా, దాని రూపమును దృష్టి లో పెట్టు కున్న, అదే ఏకాగ్రత...

సర్వ వేళలందూ విరామము లేక నామమును చేయవలెను, అదే నిత్య జీవితంలో చేయవల్సిన మొట్ట మొదటి పని..ఆదిత్యయోగీ.

మొక్క నాటిన కొన్ని రోజుల తరువాత ఎలా ఆకులు, పూలు, కాయలు, పండ్లు వస్తాయో అలానే ...

మనం చేస్తున్న నామస్మరణ మహిమ కూడా అలా వుంటుంది...

దిన దినము మన మనసును అభివృద్ధి చెందింప చేసి, నిత్యజీవితంలో దిన దినాభి వృద్ధి కలిగి, మనలను భగవంతునికి దగ్గరగా చేర్చుతుంది.

